Registered No. M-4845

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] 1942 వ సం॥ మే నెల 15 వ తేది శుక్రవారం [నె 19 రు.



## భారతీయుల కర్తవ్యం.

### వైస్రాయిగారి హెచ్చరిక.

మన వైస్రాయి లినులితుగో ప్రభువుగారు క్రిందటివారం ఢిల్లీ రేడియోలో ప్రసంగిస్తూ చెప్పిన మాటలు ఇవి! —

ఇప్పుడు శత్రుసేనలు ఇండియాదేశము దగ్గరకే వస్తూవున్నాయి. ఇంతవరకూ మనము యితర దేశాలలో యుద్ధములు జరుగుతూఉంటే చిత్రంగా చూస్తూఉన్నాము. ఇప్పుడు మనమే శత్రువులతో యుద్ధము చేయవలసిన పరిస్థితి వచ్చింది. ఇటీవల జపానువాళ్లు బంగాళా ఖాతములోను మన కోస్తావద్దను మన స్టీమరులను ముంచివేశారు. చాలామంది సముద్రములో మునిగిపోయి చనిపోయినారు. శత్రువుల యుద్ధనౌక లిప్పుడు బంగాళాఖాతములో లేవనేమాట నిజమే. కాని అవి మళ్లీ తప్పకుండా వస్తాయనడానికి ఏమీ సందేహంలేదు.

బర్మాలో మన సైన్యాలు చాలా ధైర్యసాహసాలతో పోరాడుటవల్లనే మన ఇండియామీదకు శత్రువు వెంటనే రాలేకపోయినాడు. ఈ వ్యవధి మనకు లభించడం మన అదృష్టం. ఇండియాలో రోజురోజుకూ, పటాలముల సంఖ్యయున్నూ, విమానదళముల సంఖ్యయున్నూ అధికమవుతూఉన్నది. ఈ విషయమే మన సర్వసేనాధిపతియైన జనరలు వావెలుగారు 15 రోజుల క్రిందట చేసిన ప్రకటనలో చెప్పియున్నారు. శత్రువులు ఇండియామీదకు వస్తే, జనరలు వావెలుగారి నాయకత్వముక్రింద ఇండియాలో ఉన్న మన సేనలు అత్యధికమైన సమర్థతతో శత్రువును ఎదిరించగలవు. అందుకు ఎటువంటి సందేహమున్నూ లేదు.

#### మన ఆయుధబలం.

ఇండియాలో ఆయుధాలు లేనివారు అనేక లక్షలమంది ఉన్నారు. దేశంలో ఉన్న ప్రజలందరూ యుద్ధభూమికి పోనక్కరలేదు. ప్రజలందరికీ ఆయుధముల నియ్యడం సాధ్యమైన

పనికాదు. ఈ మహాసంగ్రామం ప్రారంభమైన తరువాత, ఏ దేశంలోనైనాసరే ప్రజలందరికీ కూడా ఆయుధాలు ఇవ్వబడలేదు. యుద్ధానికి పూర్వం అసలే యివ్వబడలేదు. 1940 వ సం॥ జూనులో ఇంగ్లండులోని ప్రజల కందరికీకూడా ఆయుధాలు యివ్వబడెనా? 1941 వ సం॥ జూన్ నెలలో రష్యాదేశంలోని ప్రజలకందరకూ ఆయుధాలు ఇవ్వబడెనా? చీనావారు అయిదేళ్ల నుంచీ శత్రువులతో ఏకదీక్షగా యుద్ధం చేస్తున్నారుగదా, యుద్ధం ప్రారంభంకాగానే చీనా దేశంలో ప్రజలందరికీకూడా ఆయుధా లియ్యబడెనా? ఈ దేశాలలోని ప్రజల కెవ్వరికీకూడా ఒక్కసారిగా ఆయుధాలు సప్లయి చేయబడలేదు. శత్రువులతో పోరాడే సైనికులకు ఆయుధాలు సప్లయి చేయబడినవి కాని, సైనికులు కానివారు కూడా యీ యుద్ధానికి అనేకవిధాలుగా సహాయం చేయవచ్చు.

### అయితే, ఇప్పుడు నేనేమిచెయ్యాలి ?

నేనేమి చెయ్యవలెను? అని చాలామంది అడుగుతూ ఉంటారు. చెయ్యడానికి చాలా పనులు ప్రతివానికీ సిద్ధంగా ఉన్నాయి. సైన్యములలో అత్యధికంగా జనులు చేరుతూ ఉన్నారు. చేర్చుకోబడుతున్నారు. ఎంతమంది చేర్చుకోబడెదరు? అనే ప్రశ్నకు అగత్యంలేదు. దీనికొక పరిమితి లేదు. ఎంతమంది వస్తే అంత మందిని సైన్యంలో చేరుస్తూనే ఉంటారు. ఈ సేనలో చేరినవారందరికీ ఆయుధ పరికరములను సమకూర్చవలసిన కార్యభారం చాలా ఉంది. ఇందుకుకూడా చాలామంది పనివాళ్లు కావాలి.

### పౌర రక్షణభటులు కావాలి.

సేనలో చేరడానికి యిష్టంలేనివారు పౌర రక్షణ దళములలో, ఏ.ఆర్.పి. దళములలో చేరవలెను. దెబ్బలు తగిలినవారికి చికిత్సలు, ఉపచారములు చేసేటటువంటి ఆంబ్యులెన్సు దళములలో కొందరు చేరవచ్చును. ఇంకా అర్హతలు కలవారు డాక్టరులుగాను, నర్సులుగాను చేరవలెను. ఆఫీసులలోను, వైద్యశాలలలోను, భోజన గృహములలోను పనిచేయుటకు చాలా మంది స్త్రీలుకూడా కావలెను. శరణాగతులై అనేక ప్రాంతాలనుండి పారిపోయివచ్చే ప్రజలకు సేవాసహాయములు చేయుటకు చాలామంది కావాలి.

### అందరూ చెయ్యవలసిన పని : మితవ్యయము.

ప్రతి స్త్రీయున్నూ, ప్రతి పురుషుడున్నూ ఒళ్లు దాచుకోకుండా తమ శక్తికి తగినరీతిగా ఏదో ఒక పనిని చేస్తూనే ఉండవలెను. అనవసరమైన ధనవ్యయం చేయకూడదు. ఆహారంగాని, బట్టలుగాని, పెట్రోలుగాని, బొగ్గులుగాని, విద్యుచ్ఛక్తినిగాని మితంగా వాడుకోవాలి. అనవసరంగా రైళ్లలో ఎవ్వరున్నూ ప్రయాణాలు చెయ్యరాదు. రవాణాల నిమిత్తం సేనలకూ, ఆయుధ సామగ్రులకూ, రైలుబళ్లు చాలా కావాలి. అనవసరమైన ఖర్చులు మనము చేస్తూ ఉంటే మనకు విజయము త్వరగా లభించదు.

వ్యవసాయదారులు తమ పొలములలో పంటలు ఎక్కువగా పండించాలి. ఫ్యాక్టరీలలో పనిచేసేవారందరూ తమ కాలం ఒక్క నిమిషమైనా వ్యర్థం చెయ్యకుండా పనిచేసి వస్తుసామగ్రులను తయారు చెయ్యాలి. ఆఫీసులలో పని చేసేవారందరూ శక్తివంచనలేకుండా, విసువు విరామం లేకుండా పనిచెయ్యాలి.

### శత్రువుల దుర్బోధలు వినకూడదు. గాలివార్తలూ వదంతులూ నమ్మరాదు.

శత్రువుల ఏజంట్లు మన పనులకు అనేక అభ్యంతరములు కలుగచేస్తారు. ప్రజలను భయపెట్టుటకు అనేక కుతంత్రాలు పన్నుతూవుంటారు. వీటిని లెక్కచెయ్యకుండా ధైర్యంతో ఎవరి పనులు వారు చేసుకుంటూ ఉండాలి. ప్రజలకు నిరుత్సాహమును, భయమును కలిగించేవారితోను, లేనిపోని వదంతులను వ్యాపింపజేసే వారితోను, మనము ప్రతిఘటించి పోరాడుతూ ఉండాలి.

### దేశంలో అందరూ ఏకీభవించాలి.

శత్రువుల నెదిరించుటకు దేశంలోని వారందరూ ఏకీభవించాలి. అన్ని పక్షములవారు యీ సమయంలో ఏకీభవించక పోవుటకు నాకు ఏవిధమైన అభ్యంతరముగాని కన్పించడంలేదు. శత్రువుల ధోరణిని, పద్ధతిని మెచ్చుకొని ఆమోదించేటటువంటి వారి సహాయమును నేనెంత మాత్రం కోరుటలేదు. మిత్రమండలి రాజ్యాల సేనలు, ఆయుధ పరికరాలు, ఇతర సామగ్రులు, చాలా అధికంగానే ఉన్నాయి. మనకు జయము కలగడానికి అవి చాలును. మనకు జయము కలిగి తీరవలెను.

మహోపద్రవం మనకింకా రాలేదు.

ఇండియా కింకా మహోపద్రవం రాలేదు. కనుక ఇప్పు డీదేశంలోని అన్ని పక్షాలవారున్ను కలిసి ఇండియాలో దేశరక్షణకొరకై ప్రజా శక్తిని ఏకముఖంగా కేంద్రీకరించాలి. " మీ హృదయములలోకి మీదృష్టిని పోనిచ్చి మీహృదయాన్ని మీరు పరిశోధించి చూచుకోండి. మీరు నిర్వర్తించవలసిన ధర్మమేదో మీ హృదయ ఫలకముమీద స్థిరాక్షరంగా లిఖించండి " అని నా సతీమణియగు లిన్‌లిత్గో ప్రభ్వి యిటీవల తన ఉపన్యాసంలో చెప్పియున్నది. ఆ వాక్యమునే మరొకమారు మీకు జ్ఞాపకము చేయుచున్నాను.

---

# ఇండియామీదకు వస్తారా ? ఆస్ట్రేలియామీదకు వెడ్తారా ?

## మద్రాసు గవర్నరుగారి ఉపన్యాసం.

శత్రువులు ఇండియామీదకు వచ్చే సూచనలు నెలరోజులక్రిందట చాలా ఎక్కువగా కన్పించాయి. కోస్తా ప్రాంతాలలో ఉన్న బస్తీలమీద బాంబులను వేయడానికి శత్రువిమానాలు ఎప్పుడు వస్తాయో చెప్పడానికి వీలులేదు. కనుక, కోస్తా పట్టణాలకు ప్రమాదం ఎప్పుడూ ఉండనేఉన్నది. కనుక ఆ బస్తీల ప్రజలు ఇందుకు సిద్ధంగాఉండి తమ ప్రాణాలను తాము రక్షించుకొనుటకు తగిన ఏర్పాటుల నన్నింటిని చేసుకుంటూనే ఉండాలి. నీలగిరివంటి పర్వతప్రాంత ప్రదేశాలకు యుద్ధ భయం లేదు.

జపాను దురాశ.

ప్రపంచమును తాను వశపరచుకోవలెననే దురాశ జపానువారికి కలిగింది. మలయారాజ్యం వారి స్వాధీనమైనది. బర్మాకూడా పూర్తిగా వారి వశమైనయెడల వారు ఇండియామీదకో ఆస్ట్రేలియామీదకో యుద్ధానికి వస్తారు. ఒక్కమారుగానే రెండు దేశాలమీదకు దండెత్తవచ్చును. లేదా ఒకటి అయిన తర్వాత ఇంకొకదానిమీదకు దండెత్తవచ్చును.

గత నెలలోనే జపాను విమానాలు మదరాసు నగరమునకు రాలేకపోయినాయి. కనుక యిప్పుడు అసలే రాలేవు. ఎందుచేతనంటే మదరాసులో నగరరక్షణ ఏర్పాటులు ఇప్పుడు చాలా అధికమైనవి.

ఇంగ్లాండునుంచీ, అమెరికానుంచీ ప్రతివారంలోను యుద్ధ సామగ్రులున్నూ మందు గుండు సామానులున్నూ అపరిమితముగా ఇండియాకు వస్తున్నాయి. ఇండియాలోకూడా ఆయుధాలు అధికంగా తయారుచేయబడుచున్నవి.

ప్రజల అయికమత్యం చాలా అవసరం.

ప్రజలందరూ ఏకీభవించి ధైర్యంగా ఉండవలెను. ఇండియాలోని ప్రజలున్నూ వారి నాయకులున్నూ యీ ఆపత్కాలములో తమ బాధ్యతలను పూర్తిగా గ్రహిస్తున్నారు. దేశానికిగల అపాయమును అర్థము చేసుకుంటున్నారు, అన్ని పార్టీలవారున్నూ ఏకీభవించి దేశరక్షణకొరకై పూనుకొనుట ముఖ్యావసరమనిన్ని, తగాదాలు పెట్టుకొని కోరగూడని షరతులను కోరగూడదనిన్ని, నాయకులు గ్రహిస్తున్నారు. ఇది చాలా సంతృప్తికరంగా ఉంది. త్వరలోనే .మనకు జయం తప్పకుండా కలుగుతుంది.

# జర్మనీమీదకు ఇంగ్లీషువారి దండయాత్ర.

## హిట్లరు అహంకారమేమిటో అంతుచూడాలి!

### బ్రిటిష్ ప్రధాని సవాలు.

క్రిందటి ఆదివారంనాడు లండను రేడియోలో బ్రిటిష్ ప్రధానియైన చర్చిలుగారు యావత్తు ప్రపంచానికీ వినబడేటట్లుగా, జర్మనీవాళ్లకుకూడా వినబడేటట్లుగా, చాలా రోషంగాను పౌరుషంగాను, భీమసేనుని లాగున మాట్లాడినారు. ఆయన చెప్పిన మాటలు వినితీరాలి.

"నేను మీకు నేడు తెలియజేయవలసిన ముఖ్య విషయ మొకటి కలదు. రష్యాలో రష్యను సైనికులమీద జర్మనులు విషవాయు ప్రయోగమును చేసినట్లుగా వార్తలు వచ్చాయి. మన మిత్రులైన రష్యావారిమీద విషవాయు ప్రయోగంచేస్తే మనమీద చేసినట్లుగానే భావించాలి. విషవాయువును మనము మొదట ప్రయోగించరాదనియు, జర్మనులు దానిని ప్రయోగించిన తరువాతనే మనము ప్రయోగింపవలెననియు, రష్యావారున్నూ, మేమున్నూ నిశ్చయించుకొన్నాము. ఇటువంటి దుర్మార్గ కార్యమును హిట్లరు చేసిన మాట రూఢియైనట్లయితే, మన బ్రిటిష్ విమాన బలమునంతను ఉపయోగించి జర్మనీలో ఉన్న సైనిక మకాములన్నింటిమీదను విషవాయు ప్రయోగం చేస్తాము. విమాన యుద్ధంవల్లనే అపరిమితమగు నష్టం కలుగుతోంది. దీనికి తోడు విషవాయు ప్రయోగం కూడా చేయడం సాగించినట్లయితే, స్థితిగతులు మరింత ఘోరమవుతాయి. కనుక, యిట్లా విషవాయు ప్రయోగాలు చెయ్యడం మంచిదేనా అనే విషయం ముందుగానే హిట్లరు బాగా ఆలోచించి నిర్ణయించుకోవాలి. శత్రువు ఇటువంటి కార్యములు చేయగలడనే సంగతి మనకు ఇదివరకే తెలియును. అందువల్ల అందుకు కావలసిన కట్టుదిట్టములన్నియు మన మిదివరకే పూర్తిగా చేసికొనియున్నాము.

#### విజయము మనదే.

విజయము మనకే కలుగుతుంది. బలీయమైన రాజ్యాలవారు మనకు మిత్రులుగా ఉన్నారు. విజయము తప్పదు. కాని అది ఎప్పుడు కలుగునో నేను చెప్పజాలను. మనకుగల సాధన సంపత్తిని చూచినచో, యీ సాధన సంపత్తిని వృద్ధి చేయుటకు మనకుగల అవకాశములను గ్రహించినచో, మనము చాలా ధైర్యంగా ముందంజ వేయగలము.

#### మన పొరబాట్లు: హిట్లరు చేసిన పొరబాట్లు.

మనకంటె ముందుగా హిట్లరు చాలాకాలము నుండియు యుద్ధసన్నాహములు చేయుచుండిన మాట నిజమే. అనేక యెత్తులు అతడు చేయుచుండిన మాట నిజమే. కాని మనకంటె అతడు యెక్కువ పొరబాటులు చేసినాడని తెలుసుకోవలెను.

రష్యామీదకు దండయాత్ర సంకల్పించి సాగించడం హిట్లరు చేసిన మొదటి పెద్ద పొరబాటు. రష్యామీదకు హిట్లరు దండెత్తగానే మొదటి సారిగా మనము రష్యాతో ఒడంబడిక చేసికొనడం జరిగింది. ఉభయులమూ కలిసి నాజీ తత్వమును పూర్తిగా నాశముచేయుటకు ఒడంబడిక చేసుకొన్నాము. హిట్లరు చేసిన రెండవ పొరబాటు ఇంకొకటి ఉన్నది. రష్యాలోని అపరిమితమైన చలికి జర్మను సైనికులు నిలువగల్గుటకు తగిన దుస్తులు లేవనే మాట అతడు మరచిపోయినాడు. వెనుకటి అయిరోపా మహాసంగ్రామంలో 20,30,893 మంది జర్మనులు చనిపోయినారని జర్మను ప్రభుత్వమువారే 1935 సం॥లో ప్రకటించారు. గత అయిరోపా సంగ్రామం అంతటిలోను ఎంతమంది జర్మనులు నాశనమైనారో మొన్న శీతకాలంలో రష్యాలో అంతమంది జర్మనులు మరణించారు. ఈ సంవత్సరం చలికాలంలో జర్మను సేనలకు కావలసిన యావత్తు కట్టుదిట్టములు ఏర్పాట్లుచేయబడినవని హిట్లరు మొన్న నీమధ్య ఉపన్యాసంలో అన్నాడు. దానినిబట్టి చూస్తే రష్యాతో యుద్ధం యీ శీతకాలం దాటేవరకుకూడా హిట్లరు చేయవలసిన స్థితి ఏర్పడిందని అర్థమౌతోంది. రష్యను చలి అంటే జర్మనులు ఎంత భయపడుతున్నారో,

## "స్పిట్ ఫైర్సు" అనబడు బ్రిటిష్ పోరాట విమానములు.



ఇవి కొత్తరకం పోరాట విమానాలు. వీనికి పెద్ద ఫిరంగులు మాత్రమే గాక, రెక్కలవద్ద చిన్న మర ఫిరంగులుకూడా కలవు. ఇవి బాంబరు విమానాలకు వెంట కావలాగా పోవుట మాత్రమే గాక, స్వతంత్రంగానే వెళ్లి శత్రు స్థానాలమీద మర ఫిరంగులతో కాల్చి రాగలవు. ఈ పటం లోనివి ఫ్రాన్సుమీదకు పోవుటకు బయలుదేరుచున్నవి.

---

యింకా దీర్ఘకాలం రష్యాతో యుద్ధం జరుగగల దనే మాటలకుకూడా జర్మనులంత హడలిపో తున్నారు.

### జర్మనీపై దాడి.

శత్రువుకంటె మన విమాన బలము యిప్పుడు హెచ్చుగా ఉన్నది. ఈ బలం క్రమేణ వృద్ధి అవుతూ ఉన్నది. ఇప్పుడు మనము జర్మనీపై సాగింపబోయే విమాన దాడులవల్ల హిట్లరు చిక్కులపాలు కావలసియున్నది. హాలెండులో రాటర్డాం నగరంమీద జర్మనులు ఘోరంగా బాంబులువేసి 20 వేల మందిని చంపివేసినారు. అందుకు ప్రాయశ్చిత్తమును జర్మనులే ఇప్పు డనుభవించుచున్నారు. జర్మనీమీదను, జర్మనీ ఆక్రమించియున్న రాజ్యాలమీదను ఇంగ్లాండు నుండి విమాన దండయాత్రలను సాగించి జర్మ నీకి ఒత్తిడి కలిగించవలెననియు, అటు రష్యా యున్ను ఇటు ఇంగ్లాండున్ను జర్మనీని ఒక్క మారుగా ఒత్తిడి చేసినయెడల, జర్మనీ అణగి



పోయి, హతమగుననియు బ్రిటిష్ ప్రజలలో చాలామంది సలహా యిస్తున్నారు.

ఇంగ్లాండుమీదకు ఇదివరలో దండెత్తి వచ్చి యుండిన విమానములలో పదియవ వంతు నాశనము చేయబడినవి. మన విమాన నష్టం జర్మను విమాన నష్టముకంటె చాలా తక్కువ. కనుక, జర్మనీమీద మనము నిర్భయంగా విమాన దాడులను సాగించగల స్థితిలో ఉన్నాము. మానవకోటికి ఎన్నో కష్టములు కలిగించిన హిట్లరు మూలంగా జర్మను ప్రజలకే కష్ట ములు రానున్నవి. అవి వారికి రాకమానవు. అయిరోపాలోని అనేక రాజ్యాలలో ఎందరెంద రిని జర్మనులు ఉరితీస్తున్నారో లెక్క లేదు. రష్యాలో ఎంతమంది స్త్రీలు పిల్లలు ఇళ్లు వాకిళ్లు లేక, అవస్థలపాలైనారో లెక్కలేదు. ఆ పాప ఫలితమంతా ఇక జర్మనులకే తిరిగి ప్రాప్తిస్తుంది. అనేక కష్టాలు వారు కూడా పొందగలరు.

# జపానుకు గొప్ప పరాభవం.

## పసిఫికుకు సముద్రంలో అమెరికను ప్రతాపం.

ఆస్ట్రేలియాకు యీశాన్యంగా కోరల్ సముద్రంలో అమెరికను యుద్ధ నావలకు జపానువారి యుద్ధ నావలకు ఒక గొప్ప నౌకా యుద్ధం జరిగింది. ఈ నౌకా యుద్ధములో జపానువారివి రెండు పెద్ద నావలు ముంచివేయబడినవి. ఇవి రెండున్నూ విమానాలు ఎక్కించుకొనేటటువంటి విమాన వాహక నావలు—ఒక్కొక్కటి సుమారు 25 వేల టన్నుల నావగా ఉంటుంది. అటువంటివి రెండు ముంచివేయబడెను. ఇది జపానువారికి చాలా ఘోరమైన నష్టం. ఒక్కొక్క నావ కొన్ని కోట్లు ఖరీదు చేస్తుంది. ఒక్కొక్క నావను నిర్మించుటకు పెక్కు సంవత్సరముల కాలము పట్టుతుంది. ఈ నౌకా యుద్ధంలో, ఇదిగాక, జపానువారి కొక క్రూయిజరు, 2 డెస్ట్రాయిర్లు, 4 ఫిరంగి నావలు మునిగెను. క్రూయిజరు నావకూడా విమాన వాహక నావవలెనే చాలా పెద్ద నావ. ముంచివేయబడిన నావలుగాక, 9 వేల టన్నుల సహాయ నావ ఒకటిన్నీ, సైనికుల గొంపోవు నావ ఒకటిన్ని పూర్తిగా చెడగొట్టబడెను. ఈ నౌకా యుద్ధంలో 6 జపాను విమానాలు కూల్చబడెను. చిల్లర నావలు అనగా మందు సామగ్రులు ఆహార సామగ్రులు తీసికొనిపోయే నావలుకూడా కొన్ని ముంచబడెను. మొత్తముమీద జపానువారివి 18 నావలు యీ నౌకా యుద్ధములో కోరలు సముద్రంలో సొలొమను దీవులవద్ద అమెరికావారి యుద్ధనావలచే ముంచబడెను.

ఈ కోరలు సముద్రము ఆస్ట్రేలియాకు సమీపంగా యీశాన్యంగా ఉంది. ఆస్ట్రేలియాకు అంగరక్షగా అమెరికను యుద్ధ నౌకాదళము ఇచట చేర్చబడియున్నది. ఈ అమెరికను నౌకాదళముతో జపానువారు ముందుగా యుద్ధము చేసిననే తప్ప ఆస్ట్రేలియాను సమీపించుటకే అవకాశము లేదు. కాని, అమెరికను యుద్ధ నౌకా దళము యీ పసిఫిక్కు మహాసముద్రంలో జపాను నౌకా దళమునకు భరతం పట్టించుచున్నది. జపానువారు అమెరికాతో గత డిసెంబరు మాసంలో యుద్ధం ప్రకటించారు. అప్పటినుంచీ యింతవరకు జపానువారివి మొత్తం 178 నావల వరకు అమెరికావారు నష్టపరచినట్లుగా లెక్క తేలింది.

ఈ నౌకా యుద్ధం యిక్కడ జరుగుతూఉండగానే, అమెరికను జలాంతర్గాములు జపానువారి సరకుల నావలను రెండింటినిన్నీ, పెట్రోలు రవాణా నావ నొకదానిన్నీ ముంచివేసెను. జపానువారికి గల నౌకా బలం యీ కోరలు సముద్ర యుద్ధంలో చాలావరకు నష్టమైంది. జపానువారు గొప్పగా చెప్పుకొనుచున్న తమ నౌకాబల ప్రతాపమున కిదీ గొప్ప పరాభవం.

---

# హిట్లరు బావకు వసంతం.

వసంతం అంటే మన పంచాంగం లెక్క ప్రకారం చైత్ర వైశాఖ మాసాలు. కాని ఐరోపా ఖండంలో వైశాఖం వెళ్లిపోతేనేగాని బాగా వసంతం ప్రవేశించదు. రషియాలో మంచుగడ్డలలో నేలంతా ఇంతవరకూ కప్పబడియున్నది. ఈ మంచును కరిగించే ఎండ ఇప్పుడిప్పుడే వస్తున్నది. ఈ మంచు గడ్డలు కరిగిపోయినతోడనే రషియామీద మళ్లీ విజృంభిస్తానని హిట్లరు ఈ మధ్య సవాలుచేస్తూ తయారు తింటున్నాడు. వసంతం వచ్చింది. కాని ఈ మధ్యకాలంలో బ్రిటిషువారూ అమెరికావారూ హిట్లరుకు తెలియకుండానే విమానాలు టాంకులు అపారంగా తయారుచేశారు. అంతే కాదు. ఈ తయారుచేసిన టాంకులను విమానాలను చాలావరకు రషియాకుకూడా సప్లయిచేశారు. శీతకాలంలో రషియాలో అమితమైన చలి. ఆ చలికి బలియైన యీ జర్మను సేనలు ఇప్పుడు ఈ వసంతంలో రక్తప్రవాహాలలో జర్మను సేన

## చాటుమాటు గూఢ యుద్ధం చేయుటకు బ్రిటిష్ యోధులకు శిక్షణ.



చాటుమాటు యుద్ధం చాలా కష్టమైన విద్య. బ్రిటిష్ సైన్యంలో చాలా సమర్థులైనవారినే యీ గూఢ యుద్ధంలో తర్ఫీయతు చేస్తారు. కొన్ని రోజులవరకు నీళ్లు, నిద్రాహారాలు లేకుండా కొండలలో అడవులలోపడి తిరిగి శత్రువులను వేటాడుతూ ఉండాలి. మాను పని, భూభాగ పటములనుబట్టి త్రోవలు తెలుసికొనడం వీళ్లు ముఖ్యంగా నేర్చుకోవాలి. శత్రువుల టాంకులను వేటాడుట చాలా ముఖ్యమైన సాధకం. ఈ పటంలోని యోధులు పర్వతాలు ఎక్కుతున్నారు.

---

లను ముంచి ఎత్తడానికి జర్మనీకి తూర్పు వైపున రషియనులున్నూ, పడమటివైపున ఇంగ్లీషువారున్నూ, ఫిరంగులను బారుచేసి యుంచారు. ఈ వసంతఋతువులో జరిగేయుద్ధం ఇంచుమించుగా హిట్లరుకు ఆఖరు దెబ్బ అని చెప్పవచ్చు. ఎందుచేతనంటే జర్మనీకంటె రషియాలో జనసంఖ్య అనేక రెట్లు ఎక్కువ. జర్మనీకన్న రషియాకు సైన్యం ఎక్కువ. అదిన్నీ కాక గడచిన శీతకాలములో రషియాలో జర్మను సైన్యం చాలా నష్టమైపోయింది. ఇప్పుడు జర్మనీకి మిగిలియున్న సైన్యాన్ని యావత్తూ రషియా యుద్ధరంగంలోకి తీసుకొనివస్తేతప్ప రషియాలో సమాన ఉజ్జీగా హిట్లరు నిలువబడలేడు. రషియా దేశం ఉత్తరంనుంచి దక్షిణమువరకు 1,800 మైళ్ల పొడుగు ఉంటుంది. ఇంత దీర్ఘంగా విస్తరించియున్న రణరంగంలో రషియను సేనలు బారులు తీర్చియున్నవి. రషియా ప్రభుత్వాధిపతియగు స్టాలిను చెక్కుచెదరని గుండె ధైర్యం కలవాడు. "స్టాలిన్" అనే మాటకు "ఉక్కుమనిషి" అని అర్థం. రషియను ప్రజలందరును తమ దేశంకోసం తమ ప్రాణముల నర్పించటానికి సిద్ధంగా ఉన్నారు. ఒకవైపున ఇటువంటి రషియాతో యుద్ధంచేస్తూ రెండోవైపున బ్రిటీషువారి దాడులకు ఎదురు నిలిచి ఇటు ఆఫ్రికను ఎడారులలో ప్రచండమైన ఎండలలో యుద్ధం సాగించటం హిట్లరుకు అసాధ్యమైన పని. అయితేనేం ? ఈ వసంత యుద్ధం అంటే హిట్లరుకు చాలా సరదాగా ఉంది. ఇదంతా వసంతోత్సవం అనుకుంటున్నాడు. హిట్లరు బావను రక్తప్రవాహాల్లో వసంతమాడించడానికి మిత్రమండలి సిద్ధంగా ఉంది. "బావా ! బావా ! పన్నీరు—బావను పట్టుకుతన్నేరు" అన్నట్లవుతుంది హిట్లరు బావకు. ఈ వసంతోత్సవంతో అతని పసంతా తెలుస్తుంది. బావ మళ్లీ వచ్చిన దోవ చూచుకోవలసివస్తుంది. ఈ లడాయితో అతని బడాయి తెలుస్తుంది.

# హాలెండుకు స్వాతంత్ర్య ప్రదానము.

## హాలిఫాక్సు ప్రభువు వాగ్దానము.

అమెరికా సంయుక్తరాష్ట్రములలో బ్రిటిషు రాయబారిగా ఉంటున్న హాలిఫాక్సు ప్రభువుగారు ఇదివరలో ఇండియాకు వైస్రాయిగా ఇర్విను అను పేరుతో వ్యవహరించియున్నారు. వారు అమెరికాలో మొన్న . నీ మధ్య ఉపన్యసిస్తూ ఈ క్రింది విధంగా చెప్పారు :—

" హాలెండుకు పోయినస్వాతంత్ర్యము తిరిగి త్వరలోనే లభించగలదు. జర్మనీ మీదికే బ్రిటిషువారు దండెత్తుటకు ఈ సంవత్సరము సిద్ధముగానున్నారు. 1940 వ సంవత్సరంలో జర్మనీ విజృంభించింది. ఇప్పుడు 1942 వ సంవత్సరంలో జర్మనీమీదకు బ్రిటిషువారు విజృంభిస్తారు. ఈ సమయంలో హాలెండు ప్రజలందరున్నూ బ్రిటిషువారికి ఈ దండయాత్రలో తప్పకుండా సహాయం చెయ్యాలి. మిత్రమండలి సేనలకు హాలెండు ప్రజలు తోడ్పడినట్లయితే, హాలెండులో జర్మను అధికారం తొలగిపోయి హాలెండుకు తిరిగి స్వాతంత్ర్యము లభించగలదు. ఇప్పుడు బ్రిటిషు విమానాలు జర్మనీమీద దాడి వెడలి అనేక జర్మను పట్టణములమీదను జర్మను ఆయుధ ఫ్యాక్టరీలమీదను బాంబులు వేస్తున్నాయి. ఈవిమానదాడు లతిభీకరంగా జరుగుటవల్ల జర్మనీ తిరిగి తలయెత్తుకొని విజృంభించలేకుండా ఉన్నది. ఇదిగాక అమెరికాలోను ఇంగ్లండులోను విమానములు, నావలు, టాంకులు అపారంగా తయారవుతున్నాయి. ఎంత అధికంగా ఈ యుద్ధసాధనములు తయారగుచున్నవో వెల్లడించినట్లయితే జర్మనీకి దిగ్భ్రమ కలుగుతుంది. మనం తయారుచేయుచున్న ఆయుధ సామగ్రుల ఉత్పత్తిని ఆటంకపరచుట జర్మనీకి సాధ్యముకాదు. ఇంగ్లండులో గొప్ప సేనను సిద్ధపరచియుంచినాము. మిత్రమండలి సరియైన ముహూర్తం చూచి జర్మనిమీదకు విజృంభిస్తుంది. ఇప్పుడు జర్మను పరిపాలన క్రిందనున్న హాలెండుదేశము అప్పుడు తప్పక విముక్తి పొందగలదు. ఈ శుభ సమయము వచ్చుచున్నది. హాలెండు ప్రజలు ఎదురుచూచుచుండవలెను.''

హాలెండు రాణియగు జూలియానా ఇప్పుడు అమెరికాలోనే ఉన్నది. ఆమెకూడా తన హాలెండు ప్రజలను హెచ్చరిస్తూ రేడియోద్వారా ఒక ప్రకటన చేసింది. జర్మను నిరంకుశాధికారమును నిర్మూలించుటకు హాలెండు ప్రజలందరు ఏకముఖంగా నిలువబడి మిత్రమండలి ప్రయత్నములకు తోడ్పడవలెనని ఆమె తన ప్రజలను ప్రబోధించింది.

---

# బర్మానుంచి వచ్చిన శరణార్థులు.

## ఇండియా ప్రభుత్వము చేసిన సహాయము.

బర్మానుంచి వెడలివచ్చిన భారతీయులకు మన ఇండియా ప్రభుత్వంవారు చాలా సహాయం చేశారు. కొన్ని లోపము లుండవచ్చును. కాని ఈ లోపములనే కొండంతగా లెక్కించినందువల్ల ప్రయోజనం లేదు. వారికి చేయబడిన సహాయమునుకూడా లెక్కించి చూడవలెను. బర్మాలో

రమారమి 10 లక్షల మొదలు 1.1 లక్షలవరకు భారతీయులున్నారు. వారిలో ఎంతమంది ఇండియాకు తిరిగివచ్చారో పూర్తిగా లెక్క తేలలేదు. కాని ఇంతవరకు 3 లక్షలమంది రమారమిగా వచ్చిరని తెలియుచున్నది. ఇప్పటికిని రోజుకు 2 వేలమంది చొప్పున వస్తూనే ఉన్నారు. వీరిలో 50 వేలమంది నావలమీద రంగూనునుంచి వచ్చారు. అనేకవేలమంది ఆక్యాబునుంచిగూడా వచ్చారు. వీరందరికిని నావలను ఏర్పాటుచేయుట చాలా కష్టమైనపని. అట్లయినప్పటికిని ఇండియా ప్రభుత్వంవారు శ్రద్ధవహించి సాధ్యమైనన్ని నావలను పంపి జనాన్ని ఇండియాకు చేర్చుచున్నారు. కొంతమందిని విమానాలమీదకూడ తీసికొని వచ్చారు.

వీరుకాక బర్మానుండి మెట్టమార్గంగా చాలామంది ఇండియాకు వస్తున్నారు. ఈ మార్గము చాలా కష్టమైన అరణ్య మార్గము. ఐనప్పటికిని ఈ అరణ్య మార్గంలోనే జనానికి సాధ్యమైనన్ని సౌకర్యములను చేస్తున్నారు. త్రోవలో ఈ జనసమూహానికి సరియైన వైద్యసహాయం లేకపోయినట్లయితే చాలామంది కలరా తగిలి మరణించియుండేవారు. కాని అటువంటిది సంభవించకుండ చాలామంది డాక్టర్లను త్రోవపొడుగునా ఏర్పాటుచేసి బందోబస్తులు చేసియున్నారు. ఈ జనానికి భోజన వసతులను బసలను కూలీల సప్లయిలను మోటారు లారీలను ఉచితంగా ప్రభుత్వంవారు ఏర్పాటుచేశారు. ఈ జనము వారివారి స్వగ్రామాలకు చేరుటకు రైళ్లమీద టిక్కెట్టు చార్జీలు లేకుండానే పంపివేయబడుచున్నారు. ఈ విధంగా ఈ జనమునకు అయ్యేటటువంటి రైలు ఖర్చులను ప్రభుత్వంవారే భరిస్తున్నారు. ఒక్క స్టేషనులో 50 వేల రూపాయల కిమ్మతువరకు రైలు చార్జీలు వీరి కొరకు ప్రభుత్వంవారు భరించారు. ఈ విధంగానే అనేక ఇతర రైల్వే స్టేషనులలోకూడా ఉచితంగా చాలా మొత్తం వీరి రైలు చార్జీల కొరకై భరించబడెను. ఈ ప్రజలు వేరువేరు రాష్ట్రాలలో ఉన్న తమ స్వగ్రామాలకు పోవుచున్నందువల్ల ఆయా రాష్ట్రాలలో వీరికి కావలసిన సౌకర్యములను చేయుటకు రాష్ట్రీయ ప్రభుత్వములు చాలా శ్రద్ధవహించి తోడ్పడుచున్నవి. ఆ ప్రభుత్వములేకాక ధర్మబుద్ధిగల ప్రజాప్రముఖులుకూడా చాలామంది కమిటీలుగా ఏర్పడి వీరికి సహాయం చేస్తున్నారు.

బర్మానుంచివచ్చిన ఈ ప్రజలకందరికి ఇండియాలో పనిపాటులు నౌకరీలు చూపించవలసియున్నది. వీరిలో మంచి యంత్ర ప్రవీణులైనవారు యుద్ధావసరములైన పనులకు నియమింపబడగలరు. అటువంటి పనులలో చేరదలచినవారు తమ గ్రామాలకు సమీపంలో ఉన్న నేషనల్ సర్వీసు లేబరు ట్రిబ్యూనలు అధికారులకు దరఖాస్తులు పెట్టుకొనవలెను.

బర్మాలో చదువుమానివేసి ఇండియాకువచ్చిన వారికి ఇక్కడ విద్యాభ్యాసమునకు కావలసిన సౌకర్యములు చేయబడుచున్నవి. ఇక్కడకు చేరినవారియొక్క ఆశ్రితులును బంధువులును కొంతమంది బర్మాలోనే మిగిలియున్నారు. అట్టివారికి అలవెన్సులను ఇచ్చుటకు ప్రభుత్వంవారు పూనుకొన్నారు. ఇదివరకు బర్మా ప్రభుత్వముక్రింద పనిచేసిన ఉద్యోగులకు ప్రావిడెంటుఫండు జీతాలు పింఛనులు బర్మా ప్రభుత్వంవల్ల రావలసియున్నవి. ఇటువంటి పైకములను బట్వాడా చేయు విషయములో బర్మా ప్రభుత్వమువారు తమ ప్రతినిధులను ఇండియాలో నియమించియున్నారు. బర్మాలో చాలామంది భారతీయుల భవనములు మొదలైన స్థిరాస్తులు శత్రువువల్ల నాశనము చేయబడెను. అట్టి భవనములకు యుద్ధప్రమాద భీమాలుకూడా చేయబడెను. ఈ భీమా మొత్తములను ఇప్పుడు చెల్లించవలసియున్నది. ఈ విషయమై ఇండియా ప్రభుత్వమువారు ఆలోచిస్తున్నారు.

బర్మానుంచివచ్చినటువంటి జనుల కందరికిని జాతి విచక్షణలేకుండా పక్షపాతంలేకుండా తెల్లవారు నల్లవారు అనే భేదంలేకుండా అందరికి సమానంగా కావలసిన సౌకర్యములన్నీ చేయబడుతున్నవి. అక్కడక్కడ కొందరి విషయములో తగినంత ఆదరణ చూపబడి యుండకపోవచ్చును. ఇండియా అంతటను అనేక ప్రాంతములలో ఈ శరణాగతుల సౌకర్యార్థమై అనేక అధికార వర్గములు పనిచేయుచున్నవి. వీనినన్నిటిని ఒక్కపద్ధతిగా సమన్వయించటానికి తగిన వ్యవధిగాని అవకాశముగాని లేదు. అందువల్ల వ్యవహార లోపములు కొన్ని యుండవచ్చును. ఏవో కొన్ని సందర్భములలో జరిగిన కొలది లోపములను కొండంతగా చెక్కించి ప్రభుత్వంవారు చేయుచున్న అత్యధిక సహాయమును మరచిపోకూడదు.

---

